# పేరులేని అబ్బాయి

మధ్య ఆసియా, గల్ఫ్ ప్రాంతం నుంచి ఇద్రిస్ షా సేకరించిన అనేక సూఫీ కథలలో ఇదొకటి. అక్కడ కథలు చెప్పే సాంప్రదాయం వెయ్యేళ్లకు పైగా సాగుతోంది. షా సేకరించిన కథలు పెద్దల్ని, పిల్లల్ని ఆకట్టుకున్నాయి.

పేరులేని ఒక అబ్బాయి పేరు కావాలని స్నేహితుడిని అడుగుతాడు. చివరికి అతడికి పేరు దొరుకుతుంది, అంతేకాదు అతనికి ఉన్న ఒక పాత కలకి బదులు కొత్త కల దొరుకుతుంది.





అనగా, అనగా చాలా సంవత్సరాల క్రితం సంగతి. ఒక ఊళ్లో ఒక అబ్బాయికి పేరు లేదు. పేరు లేకపోవటం చాలా వింత విషయం. “ఆ అబ్బాయికి పేరు ఎందుకు లేదు?” అని మీరు అడగవచ్చు.



ఆ అబ్బాయి పుట్టిన తరవాత అమ్మా, నాన్నా అతడికి పేరు పెడదామని అనుకుంటూ ఉండగా వాళ్ల ఇంటికి ఒక జ్ఞాని వచ్చాడు.
"ఈ పిల్లవాడు చాలా అదృష్టవంతుడు," జ్ఞాని అన్నాడు, "ఒక రోజు ఇతడికి అద్భుతమైన వస్తువు ఇస్తాను. అయితే అంతకంటే ముందు ఇతడికి పేరు ఇస్తాను. అప్పటివరకు అతడికి మీరు పెట్టవద్దు."
"అలాగే," అన్నారు అమ్మా, నాన్నలు. "మా అబ్బాయికి పేరు ఎప్పుడు పెడతారు?"
"ఆ సంగతి నేను ఇప్పుడే చెప్పలేను," చేప్పాడు జ్ఞాని. "ఇతడు అదృష్టవంతుడని, ఇతడికి మీరు పేరు పెట్టగూడదని మరిచిపోవద్దు."





ఆ అబ్బాయికి పేరు లేదు కదా. అందుకే అతడి అమ్మా, నాన్నలు 'అనామకుడు' అని పిలిచేవాళ్లు.



ఒక రోజు ‘అనామకుడు’ పక్క ఇంటిలో ఉండే స్నేహితుడి దగ్గరకు వెళ్లాడు. “అందరికీ పేరు ఉంది. నాకు కూడా పేరు ఉంటే బాగుండునని ఉంది. నీ పేరు నాకు ఇస్తావా?” అతడు స్నేహితుడిని అడిగాడు.

“నాకు ఉన్నది అన్వర్ అని ఒక్క పేరు. అది నీకు ఇస్తే నాకు ఏముంటుంది? ఒకవేళ నా పేరు నీకిస్తే, నువ్వు నాకేమిస్తావు? నీ దగ్గర ఏముంది?”



“నా దగ్గర ఒక కల ఉంది. అది నీకు ఇస్తాను,” ‘అనామకుడు’ చెప్పాడు.

“కానీ, నా పేరుని నీకు ఎలా ఇవ్వాలి, నీ కలని నాకు ఎలా ఇస్తావు?” అన్వర్ అడిగాడు.

“నాకు తెలుసు,” ‘అనామకుడు’ చెప్పాడు, “పద, వెళ్లి జ్ఞానిని అడుగుదాం!”

ఆ జ్ఞాని దగ్గరలోనే ఉన్నాడు.



“ఇక్కడ కూర్చోండి. నా దగ్గర పెట్టెల్లో ఏముందో చూస్తాను,” జ్ఞాని అన్నాడు.

పిల్లలు ఇద్దరూ అతడికి దగ్గరగా కూర్చున్నారు.

జ్ఞాని ఒక పెట్టె తెరిచాడు. “ఈ మాయల పెట్టెలో అన్ని రకాల పేర్లు  ఉన్నాయి,” అన్నాడు.



అతడు ఆ పెట్టె మూత తెరవగానే ఆ పిల్లలకి చాలా పేర్లు వినిపించసాగాయి.
అందులో అన్ని రకాల పేర్లు ఉన్నాయి, పేర్లు, పేర్లు, పేర్లు. తమ పేర్లు పలుకుతున్న పేర్లు, ఇతరుల పేర్లు పలుకుతున్న పేర్లు, ప్రపంచంలోని అన్ని దేశాలలోని పేర్లను పలుకుతున్న పేర్లు.

ఆ జ్ఞాని పెట్టెలోంచి ఒక పేరు తీసి పేరులేని అబ్బాయికి ఇచ్చాడు. ఆ పేరు ఎగిరి ఆ అబ్బాయి అరచేతిలోకి దూకింది, చేతి మీద పరిగెత్తుతూ భుజం మీదకి ఎక్కింది. అక్కడినుంచి అతడి చెవిలో నుంచి మెదడులోకి దూరింది.



ఆ అబ్బాయికి ఉన్నట్టుండి తనకి పేరు దొరికినట్టు అనిపించింది!
“హేయ్! హేయ్!” అంటూ అతడు అరిచాడు.
“నాకు పేరు దొరికింది. నేను హుస్నీని!”
హుస్నీ అతడి పేరు.



“హుస్నీ నాకు ఇస్తానన్న కల నాకు కావాలి!” అంటూ అన్వర్ అరిచాడు.
“ఓపిక పట్టు, బాబు!” జ్ఞాని అన్నాడు.



అతడు మరొక పెట్టె మూత తెరిచాడు.
“మనుషులకు అవసరం లేని కలలు
ఇందులో ఉంటాయి,” చెప్పాడు జ్ఞాని.
“హుస్సీ, నీ తలను చేతితో తాకి ఈ పెట్టలో
పెడితే నీ కల అందులోకి వెళుతుంది.”
జ్ఞాని చెప్పినట్టే చేశాడు హుస్సీ. తలను
తాకగానే అతడి చేతిలోకి కల వచ్చింది,
చేతిని పెట్టెలో పెట్టగానే ఆ కల అందులోకి
వెళ్లింది.



ఆ జ్ఞాని మరొక పెట్టెను తెరిచాడు. “ఈ పెట్టె నిండా అద్భుత కలలు ఉన్నాయి!” పిల్లలతో జ్ఞాని చెప్పాడు. అందులోని అద్భుత కలలన్నీ వాళ్లకి కనిపించాయి.



అద్భుత, ఆశ్చర్యకర కలలు!

“మీ ఇద్దరికీ చెరొక కలను ఇస్తాను,” ఆ అబ్బాయిలతో జ్ఞాని చెప్పాడు. వాళ్లకి కావలసిన కలని ఎంచుకోమన్నాడు. ఆ ఇద్దరు తమకి కావలసిన కలను తాకారు. ఆ కల ఎగిరి ఆ అబ్బాయిల అరచేతిలోకి దూకింది, వాళ్ల చేతుల మీద పరిగెత్తుతూ భుజం మీదకి ఎక్కింది. అక్కడినుంచి వాళ్ల చెవిలో నుంచి మెదడులోకి దూరింది, హుస్నీ పేరులాగానే.




హుస్నీకి ఎప్పటికీ ఉండే ఒక పేరు
దొరికింది...




**అయిపోయింది**